

శ్రీకృష్ణపరబ్రహ్మణేనమః

# కృష్ణశతకము.



శ్రీరుక్మిణీశ కేశవ
నారదసంగీతలోల నగధరశౌరీ
ద్వారక నిలయ జనార్దన
కారుణ్యముతోడ మమ్ముఁ గావుముకృష్ణా. 1

టీ. కృష్ణా=ఓకృష్ణా, శ్రీ=శుభప్రదమైన, రుక్మిణీశ=రుక్మిణీదేవికి పతియైనవాఁడా, కేశవ నారదసంగీతలోల=కలహాభోజనుడగు నారదుని సంగీతమువలన మనస్సు చలించువాఁడా, నగధర=గోవర్ధనగిరినెత్తి జనులను గోవులను గాపాడిన, శౌరీ=శౌర్యవంతుఁడా, ద్వారకనిలయ=ద్వారకాపట్టణమందు కాపురముండువాఁడా, జనార్దన=కృష్ణునియొక్క, కారుణ్యముతోడన్=కనికారముతో, మమ్మున్=మాయెల్లజీవులను, కావుము=కాపాడుము.

తా. రుక్మిణీదేవి మగడైనట్టియు నారదుని సంగీతమునందాసక్తిగలవాఁడవును గోవర్ధనగిరి నెత్తినవాడవును ద్వారకయందు వసించువాడవును నగు నోకృష్ణపరమాత్మ! మమ్మెల్లరను గాపాడుము.

క. నీవే తల్లివి తండ్రివి
నీవే నాతోడునీడ నీవే సఖుఁడౌ
నీవేగురుడవు దైవము
నీవే నాపతియు గతియు నిజముగ... 2

టీ. కృష్ణా! నిజముగ=నిక్కముగా, నీవే, తల్లివి=మాతవు, తండ్రివి=జనకుడవు, నీవే, నాతోడునీడ=ప్రతివస్తువతో నెప్పుడుబాయకుండు నీడవంటివాడవు, నీవే, సఖుడౌ=స్నేహితుడవు, నీవే, గురుడవు=బోధకుఁడవు, దైవము=కాపాడువాడవు, నీవే, నాపతియు=రక్షించువాడవు, గతియు=మార్గము చూపువాడవు (నగుచున్నావు.)

తా. నాతల్లియైనను తండ్రియైనను మిత్రుఁడైనను తోడైనను నీడయైనను గురుఁడైనను రక్షకుండవైనను సన్మార్గమునకయినను దుర్మార్గమునకయిన నో కృష్ణా నీవేయని తలంతును.

క. నారాయణ పరమేశ్వర
ధారాధర నీలదేహ దానవవైరీ
క్షీరాబ్ధిశయన యదుకుల
వీరా నను గావు కరుణ వెలయఁగ... 3

టీ. కృష్ణా! నారాయణ=నారాయణులలో నారాయణా, పరమేశ్వర=జగద్రక్షకా, ధారాధరనీలదేహ=నీలమేఘమువంటి శరీరముగలవాడా, దానవవైరీ=రాక్షసులకు శత్రువైనవాడా, క్షీరాబ్ధిశయన=పాలసముద్రమునందు నిద్రించువాడా, యదుకులవీర=యాదవవంశబలపరాక్రమా, కరుణవెలయఁగన్=దయామయుఁడవైనను, కావుము=రక్షింపుము.

తా. నీలమేఘమువంటి శరీరముగలిగి పాలసముద్రమునందు బండుకొనుచు రాక్షసాంతకుండవై యదుకులవీరుడని ప్రఖ్యాతిగాంచి లోకములఁ గాపాడు శ్రీకృష్ణా నన్ను గాపాడుము.

క. హరియను రెండక్షరములు
హరియించును పాతకంబు లంబుజనాభా
హరి నీనామమహాత్త్వము
హరి హరి పొగడంగ వశమె కృష్ణా... 4

టీ. శ్రీకృష్ణా! అంబుజనాభా=నాభియందు పద్మముగలవాఁడా, హరియను రెండక్షరములు=హరియను నీయక్షరములు రెండున్ను, హరియించును, పాతకములు=పాపములు బారఁద్రోలును, హరి=హాో విష్ణుమూర్తి, నీనామమహత్వము=(నీ పేరునంగల మహామహిమ, (హరిహరి) భక్తిపారవశ్యతయని యెఱుగునది) పొగడంగవశమె=యెవ్వరికిని తరముగాదు.

తా. అంబుజనాభుడనైన విష్ణుమూర్తీ! హరియను నీనామాక్షరముల మహత్వ మెవ్వరికిని వర్ణింప నశక్యము.

క. క్రూరాత్ముఁ డజామీళుఁడు
నారాయణయనుచు నాత్మనందను బిలువన్
ఏరీతి నేలుకొంటివి
ఏరీ నీసాటివేల్పు లెందును... 5

టీ. గోపాలా! క్రూరాత్ముఁడు=చెడుగుణముగలవాఁడగు, అజామీళుఁడు, నారాయణయనుచున్=నారాయణా యను పేరుగల, ఆత్మనందనున్=కన్నకుమారిని, బిలువన్=కేకవేయగా, ఏరీతిన్=ఎట్లు, ఏలుకొంటివి=కాపాడితివి, నీసాటివేల్పులు=నీవంటిదైవములు, ఎందున్=ఎచ్చోటను, ఏరీ=లేరు.

తా. దుర్మార్గుఁడగు నజామీళుఁడు తనకుమారునే నీనామమున, నారాయణా 'యని పిలిచినంతమాత్రమున రక్షించితివే! నీవంటిదైవ మెందు వెదకిన దొరకును కృష్ణా!

కం. చిలుకనొకరమణి ముద్దుల
చిలుకను శ్రీరామయనుచు శ్రీపతిపేరన్
బిలిచిన మోక్షము నియ్యఁగ
అలరఁగ మిముఁ దలచుజనులకరుదా... 6

టీ. కృష్ణా! ఓరమణి=గతితయొకతె, చిలుకను ముద్దుచిలుకన్=ముద్దు లొల్కునట్లు, శ్రీరామయనుచున్=రామురామా అనుచు, శ్రీపతి పేరన్=విష్ణువగు నీ పేరుతో, పిలిచినన్=పిలువగా, మోక్షము=నీసాన్నిధ్యము, ఈయగన్=యిచ్చిననిన్ను, అలరగన్=సంతోషించునటులగా, మిము తలచుజనులకున్=కొలుచు మానవులకు, అరుదా=మోక్షముదొరకుట దొడ్డవింతయా.

తా. కృష్ణా! తనచిలుక నొకస్త్రీనీ పేరుతో రామురామా అని పిలిచినంతనే సంతసించి మోక్షమిచ్చితివె నిన్ను సంతోషముతో గొల్చువారికి మోక్షము వింతా.

కం. అక్రూరవరద మాధవ
చక్రాయుధ ఖడ్గపాణి శార్ఙ్గిముకుందా
శక్రాది దివిజసన్నుత
శుక్రార్చిత నన్ను కరుణజూడుము... 7

టీ. కృష్ణా! అక్రూరవరద=అక్రూరునకు వరములొసంగిన రక్షకా, మాధవ=లక్ష్మీపతే, చక్రాయుధ=చక్రమాయుధముగాగలవాఁడా, చక్రపాణి=కత్తిచేతఁ ధరించినవాఁడా, శార్ఙ్గి=శార్ఙ్గమను విల్లుగలవాఁడా, ముకుందాశక్రాది శక్రాదిదివిజసన్నుత=దేవేంద్రాదులచే స్తుతింపఁబడువాఁడా, శుక్రార్చిత=శుక్రాచార్యునిచే స్తుతింపఁబడువాఁడా, నన్నున్ కరుణన్=ప్రీతితో, చూడుము.

తా. అక్రూరుఁడను రాజునకు వరములిచ్చియు చక్రము శార్ఙ్గమనబడు విల్లు, ఖడ్గము యీ మూడాయుధములు గల్గి దేవేంద్రాదిముఖ్య దేవతలచే తను రాక్షసగురువుచేతను స్తుతింపఁబడు కృష్ణా నన్ను గాపాడవే డెదను.

క. నందుని ముద్దులపట్టిని
మందరగిరిధరుని హరిని మాధవ విష్ణున్
సుందరరూపుని మునిగణ
వందితు మిముఁ దలతు భక్తవత్సలహారీ... 8

టీ. కృష్ణా! భక్తవత్సలా=భక్తులయెడ దయగలవాఁడా, కృష్ణా! నందునిముద్దులపట్టిన్=నందుని ముద్దులకొడుకువును, మందరగిరిధరునిన్=మందర పర్వతమును ధరించినవాఁడవును, హరిని=పాపహరుడవగు, మాధవున్=లక్ష్మీపతివిని, విష్ణున్ సుందరరూపునిన్=అందమైనవాఁడవను, మునిగణ వందితున్=మునుల నేకులచే నమస్కరింపఁబడువాఁడవును, (ఐన) మిము, దలఁతున్=గొలిచెదను.

తా. భక్తరక్షకుఁడవగు కృష్ణా! నందుని ముద్దులకొడుకువై మందర పర్వతమును ధరించి లోకములకెల్ల నాధారుడవై జగన్మోహనరూపుండవై మునులచే నమస్కరింపఁబడు నిన్ను భక్తితో గొల్తును.

క. ఓ కారుణ్యపయోనిధి
నాకాధారంబ వగుచు నయముగఁ బ్రోవన్
నా కేల యితరచింతలు
నాకాధిపవినుత లోకనాయక... 9

టీ. కృష్ణా! ఓకారుణ్యపయోనిధి=ఓకరుణాసముద్రా, నాకాధిపవినుత=ఇంద్రునిచే వినుతింపఁబడువాఁడా, లోకనాయక=లోకాధారా, నాకాధారంబవగుచున్=(నీవు) నాకు రక్షకుండవగుచు, నయముగన్=మంచిగా, ప్రోవన్=కాపాడఁగా, ఇతరచింతలు=అన్యాలోచనలు, నాకేల=నాకవసరము లేదు.

తా. దయామయుండవును, ఇంద్రవినుతుండవును, లోకరక్షకుండవును ఐన వో కృష్ణా నన్నెల్లప్పుడు కాపాడుచుందువని నమ్మి నే నన్యచింత మానుచున్నాను.

క. వేదంబులు గన నేరని
యాది పరబ్రహ్మమూర్తి యనఘ మురారీ
నాదిక్కుఁ జూచి గావుము
నీదిక్కే నమ్మినాను నిజముగఁ... 10

టీ. కృష్ణా! వేదంబులు=చతుర్వేదములు, గననేరని=తెలిసికొనజాలని, ఆది=మొదటి, పరబ్రహ్మమూర్తి నిర్గుణస్వరూపా, యనఘ=పాపరహితా, మురారీ=మురాసురునకు శత్రువైనవాఁడా, నిజముగన్=నిశ్చయముగా, నీదిక్కే=నీవేగతియని, నమ్మినాను (గావున) నాదిక్కు=నన్ను కృపతో జూచి, కావుము=పోషించుము.

తా. వేదములకైనను పొగడశక్యముగాని మహామహుడవైన నిన్నెవ్వరుం దెలియలేరు, గాన నేనెంత, అట్టినన్ను మరువక బిడ్డనిగా రక్షింపుము.

క. పదునాలుగు భువనంబులు
కుదురుగ నీకుక్షి నిల్పుకొని నేర్పరివై
విదితంబుగ నా దేవకి
యుదరములో నెట్టులొదగియుంటివి... 11

టీ. కృష్ణా! పదునాలుగు భువనంబులు=లోకములు పదునాల్గును, కుదురుగ=జాగ్రతగా, నీకుక్షిన్=నీగర్భమున, నిల్పుకొని=ఉంచుకొన, నేర్పరివై=ప్రజ్ఞగలవాఁడవై, విదితంబుగన్=లోకము తెలుఁగనట్లు, ఆదేవకి యుదరములోన్=కడుపులో, ఎటులుఒదిగి=గూఢముగా ఉంటివి.

తా. పదునాలుగు భువనములను నీకుక్షియందు నిలుపుకొను సామర్థ్యము గల్గిన యోమహాపురుషా! దేవకీగర్భమున నెట్లిమిడియుంటివో తెలియలేకున్నాను.

పదునాలుగులోకముల పేర్లు:—1 భూలోకము 2 భువర్లోకము 3 సువర్లోకము 4 మహర్లోకము 5 జనలోకము 6 తపోలోకము 7 సత్యలోకము (ఈ 7 న్ను ఊర్ధ్వలోకములు) 8 అతల 9 వితల 10 సుతల 11 రసా

తల 12 మహాతల 13 తలాతల 14 పాతాళలోకములను నీయేడు అధోలోకములని యెఱుఁగునది.

క. అష్టమి రోహిణి ప్రొద్దున
నష్టమగర్భమునఁ బుట్టి యాదేవకికిం
దుష్టుని గంసు వధింపవె
సృష్టి ప్రతిపాదనంచు సేయఁగ... 12

టీ. అష్టమిరోహిణి ప్రొద్దునన్=అష్టమితిథిరోజున రోహిణీనక్షత్రమైనప్పుడు, దేవకికిన్=దేవకీదేవకి, అష్టమగర్భమునన్=యెనిమిదవకాన్పున పుట్టి, సృష్టిప్రతిపాలనంబు=సృష్టియైన ప్రతిజీవిని, రక్షణచేయగన్=సేయుటకు, దుష్టునిన్=చెడుగైన, కంసునిన్=కంసుడను పేరుగల నీమేన మామయగు రక్కసుని, వధింపవే=చంపితివిగాదా కృష్ణా.

తా. కృష్ణా! ఎనిమిదవకాన్పున దేవకీదేవికిపుట్టి సృష్టినిపాలించుకొరకు దుష్టుఁడైన కంసుని వధించితివిగదా.

క. అల్లజగన్నాధునకు రే
పల్లియ క్రీడార్థ మయ్యెఁ బరమాత్మునకున్
గొల్లసతి యాయశోదయుఁ
దల్లియునై చన్ను గుడిపెఁ దనరఁగ... 13

టీ. కృష్ణా! అల్లజగన్నాధునకున్=లోకరక్షకుండవైన నీకు, రేపల్లియ=గొల్లపల్లె, క్రీడార్థము=ఆడుకొనుటకు, అయ్యెన్=వసతియయ్యెను, పరమాత్మునకున్=సర్వభూతాత్ముడవగునీకు, గొల్లసతి=యాదవకులమున పుట్టినదైనయశోద, తల్లియై=మాతయై, దనరఁగన్=ప్రీతితో, చన్నుగుడిపెన్=పాలఁద్రావించెను.

తా. పరమేశ్వరుఁడవైన నీకొకయాదవపల్లె యాటపట్టయ్యెను. యాదవవంశమణియైన యశోదతల్లి పాలిచ్చి పెంచెను. కృష్ణ వారి భాగ్య మేమందును?

క. అందెలు గజ్జెలు మ్రోయఁగఁ
జిందులు ద్రొక్కుచును వేడ్క చెలు వారంగా
నందునిసతి యాగోపిక
ముందర నాడుదువు మిగుల మురియుచుఁ... 14

టీ. అందెలుగజ్జెలు మ్రోయఁగన్=నీమ్రోగు చరణాలంకారములైన గజ్జెలును అందెలును గల్లుగల్లుమని శబ్దమివ్వఁగా, చిందులు ద్రొక్కుచున్=అటునిటు పరుగిడుచు, వేడ్కన్=సంతసమున, చెలువారంగా=రెట్టింప, నందునిసతి=నందునిభార్యయగు గోపికముందర, యశోదయెదుట, మిగులన్=మిక్కిలి, మురియుచున్=సంతసించుచు, ఆడుదువు=ఆటలాడితివిగదా కృష్ణా.

తా. నీచక్కని చిరునవ్వుతో గజ్జెలందెయలు గల్లుగల్లు మనునటుల యశోదయెదుట నాటలాడలేదా కృష్ణా.

క. హరిచ దనంబు మేనను
గరమొప్పడు హస్తములను గంకణరవముల్
ఉరమున రత్నము మెఱయఁగఁ
బరిగితి వౌనీవు బాలప్రాయము కృష్ణా. 15

టీ. కృష్ణా! నీబాలప్రాయము=చిన్ననాడు, మేనను=వంటియందు, హరిచందనంబు=పసుపురంగుగల గంధమును, కరము=ఎల్లపుడు, ఒప్పెడు=ఉండెడిది, హస్తములను=చేతులయందు, కంకణరవముల్=మురుగుల చప్పుడులును, ఉరమునన్=వక్షస్థానమందు, రత్నము=మాణిక్యమును, మెఱయఁగన్=తళతళలాడఁగా, బరగితివి ఔ=సంతసముగా నుండలేదా.

తా. కృష్ణా! నీబాల్యమున కాళ్ళగజ్జలల్లాడ, కంకణములు ధ్వనింప, శరీరమున చందనము తాపినియా, మాణిక్యము మెఱయ సంతోషముగా కాలముగడపితివిగదా!

క. పాణితలంబున వెన్నయు
వేణీమూలంబునందు వెలయఁగ బింఛం
బాణీముత్యము ముక్కున
జాణఁడవై దాల్తు శేషశాయివి... 16

టీ. పాణితలంబునను=అరచేత, వెన్నయును, వేణీమూలంబునందున్=జడమొదట, వేడుకపింఛంబు=వినోదమగు నెమలిపింఛమును, ముక్కున, ఆణిముత్యము=గుండ్రని మంచిముత్యమును, జాణడవై=గడుసువై, దాల్తు=యుంచితివి.

తా. కృష్ణా! చిన్నతనమున నరచేతవెన్న, జడలందు కేకిపింఛము ముక్కున నాణిముత్యము నుంచుకొని జాణవలె చరించలేదా.

క. మడుగుకుఁ జని కాళింగుని
పడగలపై భరతశాస్త్రపద్ధతి వెలయం
గడు వేడుకతో నాడెడు
నడుగులు నేమదిని దాల్తు నచ్యుత... 17

టీ. కృష్ణా! మడుగునకున్=చెఱువునకు, చని=పోయి, కాళింగుని=కాళింగుడను పేరుగల పాముయొక్క పడగలపై, భరతశాస్త్రపద్ధతి=నృత్యశాస్త్రరీతి, వెలయన్=చక్కగా, కడువేడుకతోన్=బహుప్రీతితో, ఆడెడు=నాట్యముద్రొక్కెడు, అడుగులున్=నీపాదములను, నేను, మదిన్=ఆత్మలో, దాల్తును=ఉంచుకొందును.

తా. కృష్ణా! కాళింగమడుగునంగల సర్పముపైనెక్కి శాస్త్రము నతిక్రమించక నాట్యము చేసిన నీపాదము నెల్లప్పుడు నామదిలో నుంచి పూజింతును.

క. బృందావనమున బ్రహ్మా
నందార్భకమూర్తి వేణునాదము నీవుం
మందారమూలమున గో
విందా పూరింతువౌర వేడుక... 18

టీ. బృందావనమున, నీవున్=నీవు, బ్రహ్మానందార్భకమూర్తీ=అత్యానందమునొసంగు బాలుడవగు గోపాలా, మందారమూలమున=మందారచెట్టుమొదట, వేడుకన్=ప్రీతితో, వేణునాదము=పిల్లనగ్రోవిధ్వని, పూరింతువు=వూదుచుందువు.

తా. కృష్ణా! బృందావనమున మందారచెట్టుమొదటఁ గూర్చుండి పిల్లనగ్రోవి నూదుదువు.

క. వారిజనేత్రలు యమునా
వారిని జలకంబులాడవచ్చిన నీవుం
జీరెలు ముచ్చిలి యిస్తివి
నేరుపురా యిదియునీకు నీతియె... 19

టీ. వారిజనేత్రలు=కమలములబోలుకన్నులుగలస్త్రీలు, యమునావారిని=యమునానదిలో, జలకంబులాడన్=స్నానముజేయవచ్చిన నీవు, చీరలు=వారికట్టెడుకోకలను, ముచ్చిలించితివి=అపహరించితివి, నేరుపురా=నీగడుసుదనమగునా, ఇదియు=ఈపని, నీకు, నీతియా=మంచిగాదు.

తా. కృష్ణా! యమునలో స్నానమాడవచ్చిన గొల్లయిల్లాండ్ర చీరలనుదొంగిలించుట నీకుతగునా.

క. దేవేంద్రుఁ డలుకతోడను
వావిరిగా రాళ్ళవాన వడిగురియింపన్
గోవర్ధనగిరియెత్తితి
గోవుల గోపకులఁ గాచుకొఱకై ... 20

టీ. కృష్ణా! దేవేంద్రుఁడు అలుకతోడను=కోపమున, వావిరిగా=మిక్కిలి, రాళ్ళవాన, వడిన్=తొందరగా, కురియింపన్=వర్షింప, గోవులను గోపకులను, కాచుకొఱకై=కాపాడుటకు, గోవర్ధనగిరి=పర్వతమును, ఎత్తితి=ఎత్తినావు.

తా. కృష్ణా! దేవేంద్రుఁడలుకతో రాళ్ళవాన గురిపింప గోవర్ధన పర్వతమునెత్తి కాపాడితివి.

క. అండజవాహన విను బ్ర
హ్మాండంబుల బంతులట్లు యాడెడునీవున్
గొండలనెత్తితి వందురు
కొండికపనిగాక దొడ్డకొండా... 21

టీ. అండజవాహన=పక్షివాహనా, బ్రహ్మాండంబుల=ముల్లోకములను, జంతువులయటుల ఆడెడు, నీవున్=నీవు, కొండలన్=గుట్టలనెత్తితి వందురు, కొండికపనిగాక=ఆపర్వతమెత్తుట యల్పముగాక, దొడ్డకొండా=గొప్పయగునా.

తా. కృష్ణా! ముల్లోకముల నల్పముగ నరచేతనాడించు నీకాగోవర్ధనమెత్తుట యల్పమగును.

క. అంసాలంబితకుండల
కంసాంతకనీవు ద్వారకపురిలోనన్
సంసారి రీతినుంటివి
సంసాదితవైరి సత్ప్రశంసిత... 22

టీ. అంస=భుజములనంట, అలంబిత=వ్రేలాడెడు, కుండల=కుండలములుగలవాఁడవును, కంసాంతక=కంసుని జంపినవాడవును, సంసాదిత వైరి=శత్రువులన్వంచినవాఁడవును, సత్ప్రశంసిత=సత్కీర్తిగలవాఁడవును, (అగుకృష్ణా) నీవు=ద్వారకాపురిలో, సంసారరీతిన్=గృహస్థువలెనుంటివి.

తా. కులుకుచుండెడి కుండలములుగలిగి కంసుఁడు మొదలగు దుర్మార్గులనుపంచి, సత్కీర్తినిగడించిన నీవు ద్వారకయందు సంసారిరూపున నుంటివి.

క. పదియాఱువేలనూర్వురు
సుదతులు యెనమండ్రునీకు సొంపుగభార్యల్
విదితంబుగ బహురూపుల
చెదరక భోగింతువౌర వేడుక... 23

టీ. పదియాఱువేలనూర్వురు=పదారువేలపైనొక వందమంది, సుదతులు=ప్రియురాండ్రు, సొంపుగన్=అందముగా, యెనమండ్రు=యెనిమిది మంది, భార్యలు=పట్టపుదేవులు, నీకున్=నీకుఁగలరు, విదితంబుగ=ఎల్లరికి హితవుగ, బహురూపుల=అనేకవేషములతో, చెదరక=వెనుదీయక, భోగింతువు=వేడుకననుభవించి వారలఁగూడ సంతసపెడుదువు.

తా. కృష్ణా! పదియారువేల వందమంది గోపికలును, యెనమండుగురు పట్టపుదేవులును, నిన్ను మోహించియుండ వారినెల్ల నీమాయలో ముంచుచున్నావు.

క. అంగన పనుపున ధోవతి
కొంగున నటుకులను ముడిచికొని వచ్చినయా
సంగడి విప్రునకిడితివి
రంగుగ సంపదలు లోకరక్షక... 24

టీ. అంగన=భార్య, పనుపున=పంపుటచే, సంగడి=హితుఁడైన, విప్రుడు=కుచేలుఁడు, ధోవతికొంగున=బట్టచివర అటుకులను, ముడిచి కొని=ముడిచికొని వచ్చిన, నిడితివిరంగుగసంపదలు=చిత్రముగా యెన్నడులేని భాగ్యమాక్షణమునవే యిచ్చితివి లోకరక్షక.

తా. భార్యపంపుటచే బట్టచివర నటుకులను మూటగట్టుకొని వచ్చిన నీస్నేహితుఁడగు కుచేలుని కద్భుతమగు భాగ్యములీయలేదాకృష్ణా!

క. హా వసుదేవకుమారక
కావుము నామానమనుచు గామినివేడన్
ఆవనజాక్షికి నిడితివి
శ్రీవర యక్షయమటంచుఁ జీరెలు... 25

టీ. హా=చింతించుచునని యర్థము, వసుదేవకుమారకా=వసుదేవు పుత్రా, కావుము=కాపాడుము, నామానమనుచున్=నామర్యాదకాపాడుమని, వేడన్=ప్రార్థింపంగా, ఆవనజాక్షికిన్=(ద్రౌపదియని యెరుఁగవలెను.) ఇడితివి=ఇచ్చినావు, ఆవర=లక్ష్మీపతే, యక్షయమటంచున్=నీచీర కుక్షయములేదు, అని మానరక్షణకరములగు చీరలనొసంగలేదా!

తా. హాకృష్ణాయని యాపత్కాలమున బ్రార్థింప నామె మానభంగముగాకుండ చీరలనిచ్చితివి.

క. శుభ్రమగు పాంచజన్యము
నభ్రంకషపగిది మ్రోవ నాహవభూమిన్
విభ్రము కాదనుజసుతా
గర్భంబులవగులఁజేయు ఘనుఁడా... 26

టీ. శుభ్రమగు=ప్రకాశమగు, పాంచజన్యము=నీచేతనుండు శంఖము, లభ్రంకషపగిదన్=మేఘముఱిమినటులు, మ్రోవన్=ఝూంకరింపఁగా, ఆహవభూమిన్=యుద్ధభూమిని, విభ్రముకాన్=(విభ్రమము)భయపడునటులు, దనుజసుతా=రాక్షసుల, గర్భంబులు=కడుపులు, వగులజేయు ఘనుడా=బ్రద్దలగునటులు చేసితివిగాదా కృష్ణా.

తా. కృష్ణా! పాంచజన్యమను పేరుగల నీశంఖముచే దుర్మార్గులగు రక్కసులకు భయమగునట్లూదితివి.

క. జయమును విజయునకీయవె
హయముల ములుగోలమోపి యదలించిమహా
రయమున ద్రొప్పవె తేరును
భయమున రిపుసేనవిరిగి పాఱఁగ... 27

టీ. కృష్ణా! జయమును=గెలుపును, విజయునకీయవె=అర్జునునకొసంగితివిగదా, హయముల=గుఱ్ఱముల, ములుగోలన్=ముల్లుకఱ్ఱ, మోపి=గ్రుచ్చి, యదలించి=బెదిరించి, మహారయమున=బహుతొందరగా, ద్రొప్పవె=తరుమవా, తేరును=రథమును భయమున, రిపుసేవ=శత్రుసైన్యము, విరిగి=కంగారుపడి, పాఱఁగ=పరుగెత్తఁగా.

తా. కృష్ణా! గుఱ్ఱముల ములుగఱ్ఱలతోఁ బొడిచి వేగిరించి భీకరముగా శత్రుసేనలోనికిఁ అరథముం ద్రోలి వైరులబెదర జయమున నర్జునునకు జేకూర్చ లేదా.

క. దుర్జనులగు నృపసంఘము
నిర్జింపఁగ వలసినీవు నిఖిలాధారా
దుర్జనుల సంహరింపను
నర్జునునకునీవు సారథ్థి తివి ... 28

టీ. దుర్జనులగు=దుర్మార్గులగు, నృపసంఘము=రాజసమూహమును నిర్జింపఁగవలసి=జయించవలసివచ్చి, నీవున్=సర్వరక్షకుఁడవైననీవు, కుమతులను సంహరింపను=చంపగా అర్జునునకు, సారథయితివి=రథము త్రోయువాడవైతివిగదా కృష్ణా.

తా. కృమాధవా! దుర్మార్గులను సంహరింపవలసివచ్చియర్జునుని రథసారథివైతివిగాదా.

క. శక్రసుతుఁ గాచుకొఱకై
చక్రముఁజేపట్టి భీష్ముఁజంపఁగ జను నీ
విక్రమమేమని పొగడుదు
నక్రగ్రహ సర్వలోకనాయక ... 29

టీ. సర్వలోకనాయక శక్రసుతుఁ గాచుకొఱకై=దేవేంద్రునకుఁ గొమారుడౌ నర్జునుని రక్షింపంనెంచి, దక్రముజేపట్టి=చక్రాయుధము బట్టుకొని, భీష్మన్=భీష్మునిజంపంగ, జను=వెళ్ళిన, నీవిక్రమమేమని పొగడుదు=పరాక్రమేమని నుతింపఁగలను, నక్రగ్రహ=మొసలినిచంపినకృష్ణ,

తా. అర్జునునిరక్షించుటకై చక్రముసుధరించి భీష్మునిజంపనెంచిన నిన్నుపొగడఁగలనా లోకరక్షకా.

క. దివిజేంద్ర సుతునిజంపియు
రవిసుతురక్షించినావు రఘురాముఁడవై
దివిజేంద్ర సుతునిగాచియు
రవిసుతుబరిమార్చి తౌర రణమున... 30

టీ. రఘురాముఁడవై, దివిజేంద్ర సుతుని=ఇంద్రసుతుఁడగు వాలిని, జంపియు= జంపి, రవిసుతురక్షించినావు=సూర్యపుత్రుండైన సుగ్రీవున గాపాడినావు, రణమున=యుద్ధమునందు, దివిజేంద్రునుతుని గాచియు=(కృష్ణా) ఇంద్రునికుమారుఁడైన యర్జునునిగాపాడి, రవిసుతున్= కర్ణుని, బరిమార్చితి=జంపినావు.

తా. రామావతారమున సూర్యపుత్రుఁడైన సుగ్రీవునిగాపాడ యింద్రసుతుఁడైన వాలినిజంపినావు. కృష్ణుఁడవై యింద్రసుతుఁడైన యర్జునుని రక్షింప సూర్యసూనుఁడైన కర్ణుని సంహరించినావు.

క. దుర్భరబాణమురాగా
గర్భములోనుండి యభవ కావుమటన్నన్
నిర్భరకృప రక్షించితి
యర్భకు నభిమన్యుసుతుని నచ్యుత... 31

టీ. దుర్భర=భరింపశక్యముగాని, బాణము రాగా, గర్భములోన్= కడుపులోనుండి, యభవ=రక్షించువాఁడా, (పాపములఖండించువాఁడా) కావుమటన్నన్=రక్షించుమని ప్రార్థింప, నిర్భరకృపన్= పెక్కుప్రేమచేత

అర్భకున్=బాలుండయిన అభిమన్యునికుమారుని, అచ్యుత=విష్ణుమూ_ర్తి, రక్షించితి=కాపాడితివి.

తా. కృష్ణా! భరింపశక్యముగాని బాణమును అభిమన్యు భార్య యగు న_త్తరగర్భమును తొలువనుండ నాగర్భమునంగలబాలుడు రక్షించు మనివేడ నశ్వత్థామదగు నారాయణాస్త్రభరమునుండి కాపాడితివి.

క. గిరులందు మేరువౌదువు
సురలందును నింద్రుఁడౌదు చుక్కలలోనన్
బరమాత్మచంద్రుఁడౌదువు
నరులందును నృపతివౌదు నయముగ... 32

టీ. పరమాత్మ! అరయంగన్=విచారింపఁగానీవు, గిరులందున్=పర్వతములయందు, మేరువౌదువు=బంగారు కొండవగుదువు, నురలందు నన్=దేవతులతో పోల్చినప్పుడు, ఇంద్రుఁడవౌదు=దేవేంద్రుఁడవౌదువు, చుక్కలలోనన్=నక్షత్రములలోచంద్రుఁడవగుదువు,నరులందున=మనుష్యుల లో, నృపతివగుదు=రాజగుదువు.

తా. కృష్ణా! నిన్ను విచారింపఁగా కొండలందు బంగరు కొండవును, దేవతలందు దేవేంద్రుండవును, చుక్కలలో చంద్రుండవును, రాజులందు చక్రవ_ర్తివిని, ఇట్లే యేవిషయమందును పైవాడవగుదువు.

క. చుక్కల నెన్నఁగవచ్చును
గ్రక్కున భూరేణువులను గణుతింపనగున్
జొక్కపునీగుణజాలము
నక్కజమగు లెక్కపెట్ట నజునకు... 33

టీ. కృష్ణా! చుక్కలఁ=నక్షత్రములను, ఎన్నఁగవచ్చున్=లెక్కింపవచ్చును, గ్రక్కునభూరేణువులను=ఇసుకభాగమును, గణుతింపనగున్=లెక్కపెట్టశక్యమగును, చొక్కపు=పవిత్రమగు, నీగుణజాలము=నీసుగుణములను, అక్కజమగు సర్జునునకుఁ=బ్రహ్మదేవునకును, అశక్యము.

తా. కృష్ణా! నక్షత్రములనుగాని, యిసుకరేణువులనుగాని, లెక్కింపవచ్చుగాని నీసద్గుణములను వర్ణింప నశక్యము.

క. కుక్షిని నిఖిలజగంబులు
నిక్షేపముజేసి ప్రళయవీరధినడుచున్
రక్షక వటపత్రముపై
దక్షతబవళించునట్టిధన్యుడ... 34

టీ. రక్షక=రక్షించువాఁడా, కృష్ణా! కుక్షిని=గర్భమున, నిఖిలజగంబులు=లోకములన్నియు, నిక్షేపముజేసి=దాచి, ప్రళయనీరధినడుమన్=కల్లోలమగు సముద్రమునడుమ, వటపత్రముపై=మఱ్ఱియాకుమీద, దక్షతఁ=సంరక్షణగా, పవళించునట్టి=నిద్రించు, ధన్యుఁడవు=మహాపురుషుఁడవు.

తా. కృష్ణా! ప్రళయకాలమునందు ఎల్లలోకములను నీకడుపుభద్రపరచి సముద్రమున మఱ్ఱియాకులపై బరుండు ధీరుఁడవు.

క. విశ్వోత్పత్తికి బ్రహ్మవు
విశ్వమురక్షించందలఁచి విష్ణుఁడవనగా
విశ్వముఁ జెరుపను హరుఁడవు
విశ్వాత్మక నీవెయగుచు వెలయుఁగ... 35

టీ. కృష్ణా! విశ్వోత్పత్తి=లోకములును అందు గల జీవరాసులును పుట్టుటకు; బ్రహ్మవు=సృష్టికర్తవు; విశ్వము=ఆలోకములను; రక్షింపదలంచి=కాపాడుటకై; విష్ణుఁడవు=రక్షకుఁడవు; (అనఘా) విశ్వము జెలుపను=ఆలోకములను పాడుసేయుటకు; సంహారకర్తయైన హరుఁడవు(ఈశ్వరుఁడవు) విశ్వాత్మక=లోకములు ఆత్మయందుగలవాడా; నీవేయగుచు వెలయుచున్నావు.

తా. కృష్ణా! సృష్టించుటకు బ్రహ్మవును, పోషించుటకు విష్ణువును, వసింపజేయుటకు హరుఁడవునగు శివుఁడవును, నీవేయగుదువు.

క. అగణిత వైభవ కేశవ
నగధర వనమాలి యాదినారాయణ యో
భగవంతుఁడ శ్రీమంతుఁడ
జగదీశ్వర శరణు శరణు శరణము... 36

టీ. అగణితవైభవ=లెక్కింపవీలులేని భోగభాగ్యములుగలవాడా; కేశవ, నగధర=పర్వతమునెత్తినవాఁడా; వనమాలీ=విష్ణుమూర్తీ; ఆదినారాయణ=యోభగవంతుఁడ; శ్రీమంతుఁడ=ఐశ్వర్యముగలవాఁడా; జగదీశ్వర=రక్షకా; శరణు శరణూ=అనేకనమస్కారము.

తా. గణింపశక్యముగాని విభవముగలనారాయణానమస్కారము.

క. మగమీనమవై జలనిధి
బగతుని సోమకునిఁజంపి పద్మభవునకున్
నిగములు దెచ్చియిచ్చితి
సుగుణాకర మేలు భర్గశుభకర... 37

టీ. మగమీనమవై=పోతుచేపవై, జలనిధి=సముద్రమున, బగతుని=వైరిని, సోమకుని=సోమకుఁడను రక్కసుని చంపి, పద్మభవునకున్=బ్రహ్మకు, నిగమములు=వేదములు తెచ్చియిచ్చితివి, సుగుణాకర మేలు=బంగరుకొండనుండు, భక్తశుభకర=భక్తులకు శుభములొసంగు కృష్ణా.

తా. కృష్ణా! చేపవై నీవిరోధియైన సోమకాసురుగడతేర్చి బ్రహ్మకు వేదములం దెచ్చియిచ్చితివి.

క. అందఱు సురలును దనుజులు
పొందుగ క్షీరాబ్ధిఁ దరువ పొలుపుగ నీవున్
అందం బగు కూర్మంబై
మందరగిరి ఎత్తితౌర మాధవ... 38

టీ. కృష్ణా! అందఱుసురలును=సురలందరును, దనుజులు=రాక్షసులు, పొందుగ=అమృతమునందుటకు, క్షీరాబ్ధిందరువ=పాలసముద్రము తరచఁగా, అందంబగు కూర్మంబై=చక్కని తాబేలువై, మందరగిరి=బంగారుకొండను, ఎత్తితౌరమాధవ=ఎత్తితివి కాదా శ్రీపతే.

తా. కృష్ణా! దేవతులు, రక్కసులును అమృతముకొఱకై పాలసముద్రమును దఱచుచుండ నీవు కూర్మమవై మందరగిరి నెత్తలేదా.

క. ఆదివరాహము వయ్యును
నాదనుజు హిరణ్యనేత్రు హతు జేసితగన్
మోదమున సురలు పొగడఁగ
మేదిని వడి గొడుగు నెత్తిమెఱసితి... 39

టీ. కృష్ణా! ఆదివరాహమవయ్యును=అడవిపందివై, ఆదనుజున్=రక్కసుఁడగు, హిరణ్యనేత్రు=హిరణ్యాక్షుని, హతుఁజేసి=సంహరించి, మోదమున=సంతసమున సురలుపొగడఁగ, మేదిని=భువిపై, గొడుగ ్తితివి=రక్షకుఁడవయితివి.

తా. కృష్ణా! అడవిపందివయి హిరణ్యాక్షుఁడను రక్కసుని చంపి లోకరక్షితుండవయితివి.

క. కెరలి యరచేతఁ గంబము
నరుదుగ వేయుటయు వెడలి యసురేశ్వరునిన్
బురమునఁ జేరి వధించితి
నరహరిరూపావతార నగధర... 40

టీ. కృష్ణా! కెఱలి=ఉగ్రమున, అరచేతన్=చేతితో, కంబము=స్తంభమును, అరుదుగ=ఆశ్చర్యముతో, వేయుటయున్=హిరణ్యకశిపుఁడు కొట్టఁగా, వెడలి=నీసందుండి బయలుదేరివచ్చి, యసురేశ్వరుని=హిరణ్యకశిపుడను రాక్షసుని, యురమునుజీరి=గుండెలవ్రక్కలుజేసి, వధించితి=చంపితివి, నరహరిరూపమున=నారసింహవేషమున.

తా. హిరణ్యకశిపుఁడు నీమహిమయెఱుంగక స్తంభమున జూపుమని ప్రహ్లాదునడుగుచు స్తంభము గ్రుద్దగనే నారసింహరూపున అందుండివచ్చి గుండెలనుచీల్చి చంపితివి గాదాకృష్ణా.

క. వడుగడవై మూడడుగుల
నడిగితి వౌ భళిర భళిర యఖిలజగంబుల్
దొడిగితివి నీదు మేనను
గడుచిత్రము నీచరిత్రము ఘనుఁడవు... 41

టీ. కృష్ణా! వడుగువవై=బ్రహ్మచారివై; మూడడుగులనడిగితి వౌ=మూడడుగులభూమి నడిగితివి; భళిభళీ=మేలుమహాత్మా; తొడిగితివి=కొలిచినావు; నీదుమేనన్=నీపాదముచే; నఖిలజగంబుల్=సర్వలోకములు గడుచిత్రము నీచరిత్ర=తెలుసుకొనజాలని ఇంద్రజాలుఁడవు.

తా. కృష్ణా! బ్రహ్మచారివలెవచ్చి బలిచక్రవర్తిని మూడడుగులభూమిదానమిమ్మని జగత్తంతయు నీమూడుపాదములతో కొలిచితివి.

క. ఇరువదొకమాటు నృపతుల
శిరములు ఖండించి తౌరచేఁ గొడ్డంటన్
ధరఁ గశ్యపునకు నిచ్చియు
బరఁగఁగ జమదగ్ని రామభద్రుఁడ... 4

టీ. కృష్ణా! ఇరువదొకమాటు నృపతిశిరములు=రాజులతలలు; ఖండించితి=తెగఁగొట్టితివి; ఔరా (ఆశ్చర్యము) చేగొడ్డంటన్=నీచేతఁగ గండ్రగొడ్డలిచేతన్; ధరకశ్యపునకునిచ్చియు=భూమినికశ్యపుండనుమునకిచ్చి; పరగితి=కీర్తిగొంటివి.

తా. కృష్ణా! నీచేతిగొడ్డలిచేతనేక్షత్రియులతలలు యిరువదియొకమారు తెగగొట్టి భూవలయంబంత యాకశ్యపుఁడను మునికిచ్చితివి.

క. దశకంఠుని బరిమార్చియు
కుశలముతో సీతదెచ్చికొనుచు నయోధ్యన్
విశద మగుకీర్తి నేలిన
దశరథరామావతార ధన్యుఁడ...

టీ. దశరధరామావతారా=దశరధునకు కుమారుఁడవయి రామా యనుపేరంది; దశకంఠునిఁ బరిమార్చియు=రావణాసురునిఁజంపి; కుశలముతో సీతఁ దెచ్చి=సంతోషముతో సీతాదేవిని తోడ్కొనివచ్చి; కొనుచున్=ఏలుచు; విశదముగు కీర్తిన్=మంచిపేరును; ఏలన=సంపాదించినకృష్ణ.

తా. కృష్ణా! దశరధునకు కొడుకువయి పుట్టి రాముఁడను పేరునఁబిల్వబడి రావణుండపహరించిన సీతకయి రావణునంత మొందించి సీతను దెచ్చియేలుకొని మంచికీర్తిగడించితివి.

క. ఘనులగు ధేనుకముష్టిక
దనుజుల జెండాడితౌర తగ భుజశక్తిన్
అనఘాత్మ రేవతీపతి
యనఁగా బలరామమూర్తి వెలసితి... 44

టీ. కృష్ణా! వెలసి బలరామమూర్తివయి=బలరాముఁడవయిపుట్టి, ఘనులగు=గొప్పబలవంతులగు ధేనుక; ముష్టికదనుజులు=ధేనుకుఁడనురక్కసుని, ముష్టికుఁడను రాక్షసుని; చెండాడితి=చంపితివి; భుజబలశక్తిన్=పరాక్రమవంతుఁడవగుటచే.

తా. కృష్ణా! బలరాముఁడను పేరునఁబరగి ధేనుక, ముష్టికులను రాక్షసులంబరిమార్చితివి.

క. త్రిపురాది దైత్యసతులకు
నిపుణతతో వ్రతముఁ జెప్పినిలిపితి కీర్తుల్
కృపగలరాజవు భళిరే
కపటపు బుద్ధావతారఘనుఁడవు... 45

టీ. త్రిపురాదిదయిత్య సతులను=త్రిపురాసురుఁడు మొదలగు రాక్షసుల భార్యలకు, నిపుణతతో=నేర్పుతో, వ్రతముజెప్పి=కృత్రిమవ్రతము నుబోధించి, నిలిపితికీర్తుల్=పేరునిలిపినావు, కృపగలరాజవు=భళిరే, కపటపు=మర్మముగల బుద్ధావతార, ఘనుఁడవుకృష్ణా.

తా. కృష్ణా! కపటబుద్ధావతారమెత్తి త్రిపురాసురాది దానవుల భార్యలకు వ్రతములను బోధించి లోకోత్తమమగు పనులను జేసితివి.

క. బలుపు గలతేజి నెక్కియు
నిలపై ధర్మంబు నిలుప హీనులఁ ద్రుంపన్
గలియుగము తుదకు వేడుక
కలికివిగా నున్నలోక కర్తవు... 46

టీ. కృష్ణా! బలుపుగల తేజినెక్కియు=బలమయిన గుఱ్ఱమునెక్కి, ఇలపయి=భూమిమీద ధర్మంబునిలుప, హీనులు=దుర్మార్గులను, ద్రుంపన్=సంహరించుటకు, కలియుగముతుదకు=కలియుగాంతమునకు, వేడుక=సంతసముతో, కలికివిగానున్న లోకకర్తవు=కల్క్యవతారమెత్తినవాఁడవు.

తా. బలమయిన గుఱ్ఱమునెక్కి దుర్మార్గులను సంహరించుటకయి కల్క్యవతారమెత్తితివి గదాకృష్ణ.

క. వనజాక్ష భక్తవత్సల
ఘను లగుత్రైమూర్తులందుఁ గరుణానిధివై
విను నీసద్గుణజాలము
సనకాదిమునీంద్రు లెన్నఁజాలరు... 47

టీ. వనజాక్ష=కమలనేత్రా; భక్తవత్సల=భక్తులయందు ప్రేమగలవాఁడా; (ఘనులౌ) త్రైమూర్తులందు=త్రిమూర్తులందును; సనకాదిమునీంద్రులు=సనక సనందనాది మునులును, నీసద్గుణజాలమును; ఎన్నఁజాలరు=వర్ణింపలేరు.

తా. కృష్ణా! త్రిమూర్తులుగాని సనకాదిమునులుగాని; నీసద్గుణములనెన్నఁగలేరు.

క. అపరాధసహస్రంబులు
నపరిమితములైనయఘము లనిశము నేనున్
గపటాత్ముఁడనై చేసితి
చపలుని ననుఁ గావు శేష శాయివి... । 48

టీ. కృష్ణా! అపరాధ సహస్రంబులున్=వేనవేలు తప్పులను; అపరిమితములయిన యఘములు=చెప్పరానిపాపములను; అనిశము నేనున్=నేనెల్లప్పుడును; కపటాత్ముఁడనయి=కుచ్ఛితుఁడనయి చేసితిని; చపలునిన్=బుద్ధినిలకడలేని, నన్ను గావుము.

తా. కృష్ణా! తెలియక ననేకపాపకృత్యములొనరించితి గావునవాటినన్నిఁటిని మన్నింపవేడెదను.

క. నరపశును మూఢచిత్తుఁడ
దురితారంభుఁడను మిగులదోషకుఁడనునీ

గుఱుఁ దెఱుఁగ నెంతవాఁడను
హరి నీవే ప్రాపు దాపువౌదువు... 49

టీ. నరపశును=రెండుపాదములుగల పశువును, మూఢచిత్తుఁడన్=దుర్మార్గపు మనస్సుకలవాడను, దురితారంభుఁడను=పాపములుసేయుట కుమనముగలిగినవాఁడను, మిగులదోషకుఁడను, గురు తెరుఁగన్=తెలసికొన నెంతవాఁడను నాచేత నేమగును కృష్ణ.

తా. కృష్ణా! పాపకృత్యములనుచేయునరపశువును గాన, నన్నెటుల గాపాడవలెనో అట్లే కాపాడుదువని నమ్మెదను.

క. పరనారీముఖపద్మము
గురుతుగఁ గుచకుంభములను గొప్పనునడుమున్
అరయఁగ గనిమోహింతురు
నిరతము నినుఁ భక్తిఁ గొల్వనేరరు... 50

టీ. కృష్ణా! పరనారీ ముఖపద్మమునన్=ఇతరకాంత మోమును, కుచకుంభయుగమున్=స్థనములను, కొప్పను, నడుమును, గురుతుగ=శ్రద్ధతో, కని=చూచి మోహింతురు, నిరతము=ఎల్లపుడును, నినుభక్తిఁగొల్వ లేరు.

తా. కృష్ణా! పరస్త్రీలయొక్క స్థనములు, కొప్పు నడుము చూచి మోహింతురుగాని మోక్షసాధనమగు నీనామస్మరణసేయలేరు తరించలేరు.

క. పంచేంద్రియమార్గంబులు
కొంచెపుబుద్ధిని జరించి కొన్నిదినంబుల్

యించుక సజ్జనసంగతి
నెంచుచు మిమ్మెఱిఁగినాఁడ నిప్పుడు... 51

టీ. పంచేంద్రియమార్గంబులు=ఇంద్రియపంచకముయొక్క దారులు, కొంచెపుబుద్ధినిఁజరించి=లోలత్వముచేతిరిగి, కొన్నిదినంబుల్=కొన్నాళ్ళు, (మిమ్మెరుంగలేక) యించుక=కొద్దిగా, సజ్జనసంగతిన్=మంచిసహవాసము, యెంచుచు=సేయుచు, మిమ్మెఱిఁగినాడ=మిమ్ము తెలుసుకొంటిని.

తా. కృష్ణా! ఇంద్రియలోలుండనయి నిన్నెరుంగలేక కొన్నిదినములు గడచినయనంతరము సజ్జనసహవాసముచే నిప్పుడేమిమ్ము తెలునుకొంటిని.

క. కష్టు ననాచారుని గడు
దుష్టచరిత్రుఁడను చాల దుర్బుద్ధిని నే
నిష్టములఁ గొల్వనేరను
కష్టుని నను గావు కావు కరుణను... 52

టీ. కష్టున్=కష్టములుఁగలవాడను, అనాచారునిన్=ఆచారములేనివాఁడను, కడు దుష్టచరిత్రుఁడను=దుర్మార్గపు నడతలుగలవాఁడను, చాల దుర్బుద్ధిని=కుచ్ఛితమగు మనస్సుకలవాఁడను, నేన్=నేను, ఇష్టములఁగొల్వనేరను=నాకననపరమగు పూజసేయఁజాలను,కరుణన్=ప్రేమతో, ననుగావుము=(కృష్ణా) నన్నుగాపాడుము.

తా. కృష్ణా! దుష్టుఁడను అనాచారుఁడను దుర్బుద్ధిని నీభజనసేయఁజాలను. అట్టిచెడుగునయిన నన్నునీవే కాపాడవలెను.

క. కుంభీంద్రవరద కేశవ
జంభాసురవైరి దివిజసన్నుత చరితా
యంభోజనేత్ర జలనిధి
గంభీరుఁడు నన్నుఁ గావు కరుణను... 53

టీ. కుంభీంద్రవరద=గజేంద్రునకు ప్రాణదానము చేసినవాఁడా కేశవ; జంభాసురవైరి=జంభాసురుఁడను రక్కసుని చంపినవాఁడా; దివిజసన్నుత=దేవతులచే స్తుతింపబడువాఁడా; అంభోజనేత్ర=తామరులవంటి కన్నులుగలవాఁడా; జలనిధిగంభీరుఁడ=సముద్రమువంటి గంభీరముగలవాఁడా; కావునన్ను కరుణను=ప్రీతితో నన్ను రక్షింపుము.

తా. కృష్ణా! సముద్రమువంటి గంభీరముగలిగి దేవతలచే వినుతింపబడుచరిత్రముగలవాఁడవై గజరాజునురక్షించిన దైవమా నన్ను ప్రీతితో గాపాడుము.

క. దిక్కెవ్వరు ప్రహ్లాదుకు
దిక్కెవ్వరు పాండవులకు దీనుల కెపుడున్
దిక్కెవ్వరయ్యహల్యకు
దిక్కెవ్వరు నీవు నాకు దిక్కగు... 54

టీ. దిక్కెవ్వరు ప్రహ్లాదుకు=ప్రహ్లాదునకు గతియెవ్వరు; పాండవులకు, అహల్యకు; దీనులకు, (ఈ మొదలగు నెల్లరకు దిక్కైనవారెవ్వరో అట్టి) నీవు నాకుదిక్కగుకృష్ణా!= అట్టినీవే నాకుదిక్కు.

తా. కృష్ణా! ప్రహ్లాదునకు, అహల్యకు, పాండవులకు, గజేం

ద్రునకు, ద్రౌపదికి, యీయెల్లరకు గతియైననీవేనాకుగతి.

క. హరి నీవె దిక్కునాకును
సిరితో నేతెంచి మకరి శిక్షించి దయం
బరమేష్టి సురలు పొగడఁగఁ
గరి గాచినరీతి నన్నుఁ గావుము... 55

టీ. హరి=కృష్ణా! నీవె, దిక్కు-నాకున్=నాకురక్షకుడవు; సిరితోన్=లక్ష్మితో; ఏతెంచి=వెళ్లి; మకరిన్=మొసలిని; శిక్షించి=చంపి; దయన్=ప్రీతితో; సురలు=దేవతలు, పొగడగ, గరిఁగాచినరీతి=ఏనుగను రక్షించి నట్లు, నన్ను, కావుము=కాపాడుము.

తా. కృష్ణా! నీవేనాకుదిక్కుగాన, మకరిని సంహరించి, గజేంద్రుని రక్షించి దేవతలచేమెప్పుపొందినటుల, నన్నుగాపాడి, నాచేస్తుతింపఁబడుము.

క. పురుషోత్తమలక్ష్మీపతి
సరసిజగర్భాది మానిసన్నుత చరితా
మురభంజన సురరంజన
వరదుఁడ వగు నాకు భక్తవత్సల... 56

టీ. పురుషోత్తము, లక్ష్మీపతి, సరసిజగర్భాది దివిజసన్నుతచరితా=బ్రహ్మమొదలగు దేవతలచేస్తుతింపబడు చరిత్రగలవాడా, మురభంజన=మురాసురుని సంహరించినవాడా, సురరంజన=దేవతలకుహితుఁడా, నాకువరదుడగునన్నురక్షించు వాడవగుము.

తా. కృష్ణా! లోకమున, ఉత్తమపురుషుఁడవైన నీవు నన్నురక్షింపఁ గర్తవగుదు.

క. క్రతువులు దీర్ఘాగమములు
వ్రతములు దానములు సేయవలెనా లక్ష్మీ
పతి మిముఁ దలఁచినవారికి
నతులితపుణ్యములు గలుగు టరుదా... 57

టీ. క్రతువులు=యజ్ఞములు మొదలగునవి, దీర్ఘాగమములు=గొప్ప యాగములు, వ్రతములు, దానములు, (ఒకరికిచ్చుట) సేయవలెనా! లక్ష్మీపతి మిముఁదలచినవారికి, అతులిత=లెక్కింపరాని, పుణ్యములు గలుగుట అరుదా=అబద్ధమని.

తా. కృష్ణా! యజ్ఞయాగాదులు, దానధర్మములు, చేయుటకంటె, నీనామస్మరణయే పెక్కుఫలితములిచ్చును.

క. స్తంభమున వెలసి దానవ
డింభకు రక్షించినట్టి ఠీవిని వెలయన్
అంభోజనేత్ర జలనిధి
గంభీరుఁడ నన్నుఁ గావు కరుణను... 58

టీ. స్తంభమున, వెలసి=పుట్టి, దానవడింభకున్=ప్రహ్లాదుని,రక్షించినట్టి=కాపాడిన, ఠీవిని వెలయన్=రీతిగా, అంభోజనేత్ర=తామరల వంటికన్నులు గల్గినట్టియు, జలనిధనన్నుగావుము, కరుణన్=ప్రీతితో రక్షింపుము.

తా. కృష్ణా! స్తంభమునుండివచ్చి, ప్రహ్లాదుని కాపాడినటులదయతో నన్నును గాపాడుము.

క. శతకోటిభానుతేజుఁడ
యతులితసద్గుణగణాఢ్య యంబుజనాభా
రతినాధజనక లక్ష్మీ
పతి హిత నను గావు భక్తవత్సల... 59

టీ. శతకోటిభానుతేజుఁడ=నూరుకోట్లసూర్యులంత ప్రకాశముగలవాడ, అతులితసద్గుణగణాఢ్య=సాటిలేనిమంచిగుణములుగలమహాత్మా, అంబుజనాభా=నాభియందు తామర కమలముగలవాఁడా, రతినాధజనక=మన్మధుని తండ్రియైనవాడా, లక్ష్మీపతి, హితమతినను గావు=ప్రీతితోనన్ను గాపాడుము.

తా. నూర్గురు సూర్యుల కాంతిగలకృష్ణా! ప్రీతితో నను గాపాడుము.

క. మందుఁడ నే దురితాత్ముఁడ
నిందల కొడిగట్టినట్టి నీచునినన్నున్
సందేహింపక కావుము
నందునివరపుత్ర నిన్ను నమ్మితి... 60

టీ. మందుఁడ నేదురితాత్ముఁడ=తెలివిలేనివాడను, దుర్మార్గుడను నేనే, నిందలకొడిగట్టినట్టినీచుండ=నిందవచ్చునని యైనఁదలపక చెడుకార్యములు సేయువాడను, నన్నున్=నన్ను, సందేహింపక=అనుమానముంచుకొనక

కావుము. నందుని వరపుత్ర, నిన్నునమ్మితిని.

తా. కృష్ణా! నేననేకపాపకార్యములు జేసిననీచుండనేనైనను సంశయింపక కాపాడుము.

క. గజరాజవరద కేశవ
త్రిజగత్కళ్యాణమూర్తి దేవమురారీ
భుజగేంద్రశయన మాధవ
విజయార్చిత నన్నుఁ గావు వేగమ... 61

టీ. గజరాజవరద, కేశవ, త్రిజగత్కళ్యాణమూర్తి=మూడులోకములకును కళ్యాణమునుగూర్చువాఁడా, దేవ, మురాసురునిచంపినవాఁడా, భుజగేంద్రశయన=ఆదిశేషునిపైఁబరుండువాఁడా, నన్ను వేగమే, కావుము =కాపాడుము.

తా. విజయుండనఁబడు నర్జునునిచేఁబూజింపఁబడునట్టియు, ఆదిశేషుఁడే పాన్పుగాగలవాడవును, ఐననీవు నన్నుగాపాడుము.

క. దుర్మతినై బలుకష్టపు
కర్మంబులు జేసినట్టికష్టుని నన్నున్
నిర్మలుఁ జేయఁగవలె ని
ష్కర్ముడ వని నమ్మినాఁడ గదరా... 62

టీ. దుర్మతినై=బుద్ధిలేనివాడనై, బలు=పెక్కు, కష్టపుకర్మంబులన్=పాపకర్మములను, చేసినట్టి కష్టునినన్ను, నిర్మలుజేయఁగవలె=మలినమను పాపము లేనివానినిగాజేయవలెను, నిష్కర్ముడవని నమ్మినాడ=నీవుపాపమెఱుంగని వాడవనినమ్మితిని.

తా. కృష్ణా! తెలియక చేసిన నేకపాపములను జేసిపాప మెఱుంగని, నిన్ను నమ్మితిని గాన, నన్నీపాపమునుండి వేరు సేయుము.

క. దుర్వారచక్రధర హరి
శర్వాణీప్రణుతవినుత జగదాధారా
నిర్వాణనాథ మాధవ
సర్వాత్మక నన్నుఁగావు సరసుడ... 63

టీ. దుర్వార=భయంకరమగు, చక్రధర=చక్రమును ధరించినవాడా, హర=హరునిచే, శర్వాణీ=పార్వతిచే, వినుత=నుతింపఁబడువాడా, జగదాధారా, నిర్వాణనాథ=మోక్షమిచ్చుతండ్రీమాధవ, సర్వాత్మక=ఆత్మలన్నిటియందుండువాడా, నన్నుగావుము.

తా. కృష్ణా! భయంకరమగు చక్రమునుధరించునట్టియు పార్వతీపరమేశ్వరులచే వినుతింపఁబడునట్టియు నీవునన్గావుము.

క. సుత్రామనుతజనార్దన
సత్రాజిత్తనయనాథ సౌందర్యకళా
చిత్రావతార దేవకీ
పుత్రానను గావునీకుఁ బుణ్యము... 64

టీ. సుత్రామనుత=దేవేంద్రవినుత జనార్దన, సత్రాజిత్తనయనాథ సత్యభామాపతే, సౌందర్యకళాచిత్రావతార=సౌందర్యముచే నొప్పుచిత్రవిచిత్ర కళలతో ప్రకాశించురూపములెత్తినవాడా, దేవకిపుత్రా=దేవకీదేవి కుమారుడా, నను, గావునీకుపుణ్యము=కాపాడిన నీకుపుణ్యముండును.

తా. కృష్ణా! సత్యభామాపతే! నన్నుగావునీకు పుణ్యముగలుగును.

క. బలమెవ్వఁడు కరిబ్రోవను
బల మెవ్వఁడు పాండుసుతులభార్యను గావన్
బల మెవ్వఁడు సుగ్రీవుకు
బల మెవ్వఁడు నీవు నాకు బలమా... 65

టీ. కరిబ్రోవన్=గజేంద్రునిరక్షించుటకు, బలమెవ్వఁడు=ఎవ్వఁడుబలుఁడో, పాండుసుతుల భార్యనుగావన్=ద్రౌపదినిగాపాడుటకు, సుగ్రీవుని గాపాడుటకు, అట్టిబలుఁడవైననీవేనన్ను గావుము.

తా. ద్రౌపదీదేవిని, ఏనుగను,సుగ్రీవుని,బ్రోచిననీవేనన్ను గావుము.

క. పరుసము సోకిన నినుమును
వరుసతొ బంగారమైన వడువున జిహ్వన్
హరి నీనామము సోఁకిన
సురవందిత నేను నట్లు సులభుఁడ... 66

టీ. పరుసము సోకినన్=స్పర్శవేది తాకుటవలన, ఇనుమున, బంగారమైన వడువున=బంగారమువలే, జిహ్వన్=నోటియందు, హరి, నీనామము సోకిన, సురవందిత నేనున్=దేవేంద్రునిచే వందనములు పొందువాఁడ, నేనున్, అట్లు=పరశువుందాకిన యినుములాగున, సులభుఁడను=మోక్షార్హుఁడను.

తా. పరశువేది తాకినయినుముబంగారమగునటులనీనామస్మరణచేయుటచే నేనును బవిత్రుఁడనగుదును.

క. ఒకసారి నీదునామము
ప్రకటముగాఁదలఁచువారిపాపము లెల్లన్
వికలములై తొలఁగుటకును
సకలాత్మయజామిళుండు సాక్షియె... 67

టీ. ఒకసారి, నీదునామము, ప్రకటముగా=ప్రీతితో, తలచువారిపాపములు, ఎల్లన్=అన్నియు, వికలములై=చింతించి, తొలగుటకును, సకలాత్మ=సర్వభూతములయందుండువాడా, యజామిళుడె సాక్షి.

తా. కృష్ణా! ఒక్కమారు నీనామస్మరణప్రీతితో చేసినయెడల, సర్వపాపములు బోవునని, యజామిళుఁడేసాక్షి. పాపాత్ముండగు అజామిళుఁడంత్యమందు తనపుత్రినినారాయణాయనిపిలువ నారాయణుండగు కృష్ణుండతనికిమోక్షమిచ్చెననియెరుగుము.

క. హరిసర్వంబునఁగలఁడని
గరిమనుదైత్యజుఁడు పలుకఁగంబములోనన్
ఇర వొంది వెడలి చీరవె
శరణన్న విభీషణుండు సాక్షియె... 68

టీ. హరిసర్వంబునఁగలఁడని=ప్రతిస్థలమందునవిష్ణువున్నాడని, గరిమను=గొప్పగా, దైత్యజుఁడుబలుక=రాక్షసకుమారుండైనప్రహ్లాదుండు చెప్ప, కంబములోనన్=స్థంభమందు, ఇరవొంది=స్థావరముకలవానివలె, వెడలి, చీరవె=హిరణ్యకశిపుని చీల్చితిగాదా, శరణన్నవిభీషణుండె సాక్ష్యము=అట్లె రావణుంజంపి విభీషణుఁగూడకాచితివి.

తా. కృష్ణా! విష్ణుడెందైనంగలడని ప్రహ్లాదుడన స్థంభమునుండివచ్చి, తండ్రింజంపియాబాలుని గాచితి, శరనుజొచ్చిన విభీషణుని గావయాతనియన్నయగు రావణుంద్రుంచితివి.

క. భద్రార్చితనిజచరణ సు
భద్రాగ్రజ సర్వలోకపాలన హరి శ్రీ
భద్రానుజ కేశవ వర
భద్రాధిప నన్నుఁ బ్రోవు భయహర... 69

టీ. భద్రార్చిత నిజచరణ=భద్రయను భార్యచే పూజింపఁబడుపాదములు గలవాఁడా, సుభద్రాగ్రజ=సుభద్రకన్నవయినవాఁడా, సర్వలోకపాలన, హరి, శ్రీభద్రానుజ=బలరాముని సోదరుఁడా, కేశవ, వరభద్రాధిప=శ్రేష్ఠములగు వరములిచ్చుట యందు పెద్దవాఁడా, నన్నుబ్రోవుము, భయహర=భయములను పోగొట్టినవాడా.

తా. అవతారమూర్తియును బలరామునకును సుభద్రకును తమ్ముఁడవునన్నవునై భద్రయను భార్యచే పూజింపఁబడుచున్న ఓకృష్ణా! నన్ను మరువక గాపాడుము.

క. ఎటువలెఁ గరిమొర వింటివి
యెటువలెఁ బ్రహ్లాదు కభయమిచ్చితి కరుణన్
అటువలె నను రక్షింపుము
కటకట నిను నమ్మినాఁడఁగావుము... 70

టీ. ఎటువలెన్=ఏతీరున, కరిమొరవింటివి, ప్రహ్లాదు కభయమిచ్చితి, కరుణన్=ప్రేమతో, అటువలె=అలాగు, నన్ను రక్షింపుము, కటకట=గతిలేనివాడను, నినునమ్మినాను.

తా. కృష్ణా! గజరాజునెటులరక్షించితివో! ప్రహలాదునెటులకాపాడితివో! దిక్కులేనినన్నటులకావుము.

క. తటవట లేటికిఁ జేసెదు
కటకట పరమాత్మ దుష్టఘంటాకర్ణున్

ఎటువలె బుణ్యుని జేసితి
వటువలె రక్షింపుమయ్య యచ్యుత... 71

టీ. తటవటలు=మాయలు, ఏటికిజేసెదు=ఏలజేసెదవు, కటకటా! పరమాత్మ దుష్టఘంటాకర్ణున్=ఘంటాకర్ణుఁడను రక్కసుని, ఎటువలెబుణ్యునిజేసితివో, అటువలెన్=ఆ రీతిని, రక్షింపవయ్యా.

తా. కృష్ణా! విష్ణునామము వినరాదని గంటలు గట్టికొనిన శివభక్తుడు విష్ణునామమువినరాదు అని మనసున నిన్నుయిష్టతగా జూచినాడని శంకింపక నీవే మోక్షమిచ్చితివి అట్లేనన్నును గావుము.

క. తురగాధ్వరంబు జేసిన
పురుషులకును వేఱ పదవి పట్టుట యేమో
హరిమిము దలచిన వారికి
నరుదా కైవల్యపదవి యచ్యుత... 72

టీ. తురగాధ్వరంబు=అశ్వమేధయాగము, జేసినపురుషులకున్=మనుజులకు, వేరెపదవి పుట్టియేమో=ఇంకొకజన్మ కలదేమోగాని, హరిమిముదలఁచినవారికి, అరుదా=అడ్డముండునా, కయివల్యపదవి=మోక్షము.

తా. కృష్ణా! అశ్వమేధయాగముం జేసినవారికయినను వేరొకజన్మకలదుగాని నీనామస్మరణమాత్రమున మోక్షముగాక వేరొండులేదు.

క. ఓభవబంధవిమోచన
యోభరతాగ్రజ మురారి యోరఘురామా
యోభక్త కామధేనువ
యోభయహర నన్నుఁగావు మోహరి... 73

టీ. ఓభవబంధవిమోచన=చిక్కుపడిన సంసారమును తొలగించువాడా, ఓ భరతాగ్రజ=భరతునియన్నవగురామా, మురారి, ఓ రఘురామా

ఓభక్తకామధేనువ=భక్తులకు దేవతాగోవువంటివాడా, ఓభయహర=భయమును బారదోలువాడా, నన్నుకావుము.

తా. కృష్ణా! సంసారబంధములను విడగొట్టినట్టియు భరతుని అన్నవైనట్టియు భక్తులకు కామధేనువయినట్టియు భయమును బోగొట్టినట్టియు నీవునన్ను గాపాడుము.

క. ఓతండ్రీ కనకకశ్యపు
ఘాతకుడవై యతనిసుతుని గరుణను గాచెన్
బ్రీతిసురకోటిఁబొగడఁగ
నాతండ్రీ నిన్ను నేను నమ్మితి... 74

టీ. ఓతండ్రీ! కనకకశ్యపు ఘాతుకుడవై=హిరణ్యకశిపునిచంపి, ఆతనిసుతునిగాచి, ప్రీతిన్=ప్రేమతో, సురకోటిపొగడఁగ.=సురలచె మెప్పొందిన, నాతండ్రీ నన్నుగావుము.

తా. హిరణ్యకశిపుని సంహరించి దేవతలచే కొనియాడబడినకృష్ణా! నన్నురక్షించు నిన్నేనమ్మినాను.

క. ఓపుండరీకలోచన
యోపురుషోత్తమ ముకుంద యోగోవిందా
యోపురసంహారమిత్రుఁడ
యోపుణ్యుఁడనన్ను బ్రోవుమోహరి... 75

టీ. ఓ పుండరీకలోచన=కమలములవంటి కన్నులగలవాడా, ఓపురుషోత్తమ=ఉత్తమ పౌరుషవంతుఁడా, ముకుంద=ఓగోవిందా, ఓపురసంహారమిత్రుఁడ=ఈశ్వరుని చెలికాడా, ఓపుణ్యుఁడ నన్ను బ్రోవుము.

తా. కృష్ణా! శంకరుని చెలికాడవయిన నీవు నన్నుగాపాడుము.

క. ఏవిభుఁడు ఘోరరణమున
రావణు వధియించి లంకంరాజుగ నిలిపెన్
దీవించి యావిభీషణు
నావిభునేఁ దలతు నేను అచ్యుత... 76

టీ. ఏవిభుఁడు=ఏదైవము, ఘోరరణమున=మహాయుద్ధమున, రావణువధియించి=చంపి దీవించి, ఆవిభీషణునిలంకనిలిపెన్=లంకకు రాజుగా జేసెనో, ఆవిభునే=ఆదేవునే, నేగొల్తును=పూజింతును.

తా. రావణుని మహాయుద్ధమునజంపి విభీషణుని రాజుగాజేసిన మహాభాగ్యుఁడెవఁడోవానినే నేపూజింతును.

క. గ్రహభయదోషముఁ బొందదు
బహుపీడలు చేర వెఱచుఁబాయును నఘముల్
ఇహపరఫలదాయక విను
తహతహ లెక్కఁడివి నిన్నుఁదలఁచిన... 77

టీ. గ్రహభయదోషము బొందదు=పీడపిశాచభయముండదు, బహుపీడలు=కష్టములెన్నియైనను, చేర వెఱచు=దగ్గరకు రాజాలవు, బాయును=పోవును, అఘములు=పాపములు, (ఎందువల్లననగా) నిన్ను దలఁచుటచేత.

తా. కృష్ణా! నిన్నుగొలిచినవారికి పీడలుగాని, గ్రహములు గాని, పాపములుగాని అంటవు ఏభయమును లేదు.

క. గంగ మొదలైననదులను
మంగళముగఁ జేయునట్టి మజ్జనముఁ కున్
సంగతి గలిగినఫలములు
రంగుగ మిముఁదలఁచుసాటిరావుర... 78

టీ. గంగ మొదలయిన నదులను మంగళముగ=ప్రేమగా, జేయునట్టి మజ్జనములకున్=స్నానములసంగతి గలిగినఫలములువలన, వచ్చినపుణ్యము, మిముదలఁచు సాటిరావు నీభక్తికంటె తగ్గును.

తా. గంగ, గోదావరి, కృష్ణానది స్నానములఫలముకంటె నీభక్తియే ప్రాశస్త్యము.

క. ఆదండకావనంబునఁ
కోదండముఁగాచినట్టి కోమలమూర్తీ
నాదండ దాపు గమ్మీ
వేదండముఁ గాచినట్టి వేల్పుఁడ... 79

టీ. ఆదండకావనంబునన్=దండకాటవిని, కోదండమున్=ఆయుధమగు కోదండమును, గాంచినట్టి=పొందినట్టి, (మునులచే పుచ్చుకొని) కోమలమూర్తీ! నాదండదాపుకమ్మీ=నన్నురక్షింపుము, వేదండము గాచినట్టి వేల్పా=కరిని గాచిన దేవుఁడా.

తా. రామావతారమునమునులచే కోదండమును బహుమతిగాపుచ్చుకొనినవాఁడా నన్ను గాపాడుము.

క. చూపుము నీరూపంబును
బాపుము దుష్కృతములెల్లఁ బంకజనాభా
ప్రాపవు నాకును దయతో
శ్రీపతి నిను నమ్మినాఁడ సిద్ధము... 80

టీ. చూపుము నీరూపంబును=నీరూపము నాకుచూపుము, బాపుము దుష్కృతములెల్ల=నేజేసిన పాపములెల్లను,పోగొట్టుము, పంకజనాభా=నాభియందు తామరగలవాడా, శ్రీపతి, నిన్ను నమ్మితిఁగాన, ప్రాపవు=నాతోడగుము.

తా. నీరూపమును చూపి నన్నురక్షింపుము ధన్యుని సేయుము.

క. నీనామము భవహరణము
నీనామము సర్వసౌఖ్యనివహాకరంబున్
నీనామ మమృతపూర్ణము
నీనామము నేఁ దలంతు నిత్యుఁడ... 81

టీ. నీనామము భవహరణము=పాపనాశనము, నీనామమే సర్వసౌఖ్యనివహాకరంబున్=సర్వసుఖములకును ఆటపట్టయిననీనామము, అమృతపూర్ణము=అమృతముతో నిండియున్నది గాన, నీనామమే నేనుజపింతును.

తా. కృష్ణా! నీనామము పాపములను పోగొట్టి సర్వసౌఖ్యముల నిచ్చును అమృతముతో నిండియుండును గాన నీనామమునే జపింతును.

క. పరులను నడిగిన జనులకు
కుఱుచ సుమీ యగునటంచు కుఱుతుగనీవున్
కుఱుచవునై బలిచేమును
ధరఁపాదత్రయముఁ గొంటి దద్దయు... 82

టీ. పరులను=ఇతరులను, అడిగినజనులకు కురుచసుమీ=అడుగుకొనినవాఁడు చిన్నతనమును బొందునని, కుఱుతుగనీవున్=నీవు కుఱుతుకొరకు, కుఱుచవునై=పొట్టివాడవయి, బలిచేమును=పూర్వము బలిచక్రవర్తి చే, ధరన్=భూమిని, పాదత్రయముగొంటివి=మూడడుగులభూమినడిగికొంటివి.

తా. కృష్ణా! ఒరులనడుగుట కుఱుచగదాయని పొట్టివాడవయి మూడడుగులభూమిని బలివద్ద గయికొంటివి.

క. పాలును వెన్నయు ముచ్చిలి
లోలను మీతల్లి గట్ట రోషముతోడన్
లీలావినోది వైతివి
బాలుఁడవా బ్రహ్మకన్నఁ బ్రభుఁడవు... 83

టీ. పాలను, వెన్నయును ముచ్చిలి=దొంగిలించి, ఱోలను మీతల్లి గట్టు, రోషముతోడన్=కోపముతో, లీలావినోదిపయితివి=చిత్రవిచిత్రములగు పనులఁజేసితివి, బాలుఁడవా! బ్రహ్మనుగన్న ప్రభుండవు=బ్రహ్మను కన్న తండ్రివి.

తా. కృష్ణా! మీతల్లి రోలునకుగట్ట నీమాయచే మఱియొకచోటికే గితివి, వెన్నదొంగిలించియు దొరకక చిత్రములంజేసితివి.

క. ఏఘడియను నీనామము
లఘుమతితోఁ దలచఁగలనె లక్ష్మీరమణా
అఘములు వాపుముదయతో
రఘురాముఁడ వైన లోకరక్షక... 84

టీ. ఏఘడియను=ఎప్పుడును, నీనామములఘుమతితో=తేలికబుద్ధితోఁతలఁచలేను, అఘములు వాపుము=పాపములను బాపుము.

తా. అల్పబుద్ధిగలవాడనుగాన నన్ను నేకోరకయే కాపుము.

క. అప్పాయిత్తువు దయతో
నప్పాలను నతిరసంబు లనుభవశాలిన్
అప్పానునుఁ గనుఁగొనవే
యప్పానునుఁ బ్రోవు వెంకటప్పా... 85

టీ. అప్పా=తండ్రీ, ఇత్తువుదయతో, అతిరసంబులను=ఎక్కువమధురమగు నీనామమును అనుభవించుచున్న కష్టుఁడను నను జూడుము.

తా. కృష్ణా! అప్పాలనుబోలిన తియ్యని నీనామామృతమును నాకిత్తు వని నమ్మెదను.

క. కొంచపువాఁడని మదిలో
నుంచకుమీ వాసుదేవ గోవింద హరీ

యంచితముగ నీకరుణకుఁ
గొంచెము నధికంబు గలదె కొంతయుఁ... 86

టీ. కొంచెపువాఁడని మదిలో=మనస్సులో, నుంచకుమీ=ఉంచుకొనకుము, వానుదేవ=వసుదేవపుత్రా, గోవింద హరీ=నీకరుణకు కొంచెముగొప్పలేదు.

తా. నేను నీచుఁడనని తలఁపక నన్నేలుదువని నేనెఱుఁగుదును.

క. వావిరి నీభక్తులకున్
గావరమున నెగ్గుసేయు గర్వాంధులకున్
దేవ వధించుట వింటిని
నీవల్లను భావ్యమయ్యె నిజముగ... 87

టీ. వావిరి=పరుసగా, నీభక్తులకున్=నీభక్తులకు, కావరమున=క్రొవ్వుచే, ఎగ్గుసేయు=అపకారము సేయు, గర్వాంధులకు, దేవ, వధించుటవింటిని=నీవుచంపుటవింటిని.

తా. నీభక్తులకెగ్గుసేయువారిని నీవుదండింతువు.

క. అయ్యా పంచేంద్రియముల
ఉయ్యాలల నూగినట్టులూగితి నేనున్
అయ్యాజ్ఞఁగదల నేరను
కుయ్యాలింపుము మహాత్మ గుఱుతుగ... 88

టీ. అయ్యా! పంచేంద్రియములన్=ఇంద్రియములలోబడి, ఉయ్యాలలనూగినాను, అయ్యాజ్ఞ=ఇంద్రియముల ఏర్పాటును, గదలనేరను=విడువలేను, కుయ్యాలింపుము=నా మొఱాలింపుము.

తా. కృష్ణా! నేను ఇంద్రియవశుఁడను గాన నన్నందుండి విడిపించి ప్రీతితో రక్షింపుము.

క. కంటికి రెప్పవిధంబున
బంటుగదా యనుచునన్నుఁ బాయక యెప్పుడుం
గంటుండ వెరవనేలా
కంటక మగుపాటములను గడచితి... 89

టీ. కంటికి రెప్పవిధంబున, బంటుగదా, అనుచు=అనుకొని, ఎప్పుడును బాయక, కంటుండ=చూచుచుండగా, వెఱవనేల=కంటకమగుపాపములను గడచితిని.

తా. కృష్ణా! కంటికిరెప్పటుల నీవుగాచుచుండ నాకు పాపభయమేల కావున నాపాపములు పోయెనని సంతసించుచున్నాను.

క. యమునకు నిఁక నేవెరువను
కమలాక్ష జగన్నివాస కామితఫలదా
విమల మగునీదునామము
నమరఁగ దలచెదను నేను నమరగ... 90

టీ. యమునకు నిఁక నేవెఱువను=యమునకింకజడువను, కమలాక్ష=కమలములవంటి కన్నులుగలవాఁడా, జగన్నివాస=సర్వవ్యాపకా, కామితఫలదా=కోరికలిచ్చువాడా, విమలమగు=పవిత్రమగు, నీనామము, అమరఁగ=ఒప్పుగా, తలఁచెదను.

తా. కృష్ణా! నీనామస్మరణ చేయుచుండుటచే యమునికయినను వెరుపంబనిలేదు.

క. దండమయా విశ్వంభర
దండమయా పుండరీకదళనేత్రహరీ
దండమయా కరుణానిధి
దండమయా నీకునిపుడు దండము... 91

టీ. దండమయ్యా విశ్వంభర=లోకమెల్ల భరించువాఁడా, దండమయ్యా పుండరీకదళనేత్ర=తామరరేకులవంటి నేత్రములుగలవాఁడా, హరీ=దండమయ్యా కరుణానిధీ, కరుణాసముద్రుఁడవయిననీకు దండము.

తా. లోకములన్నియు భరించుకృష్ణా నీకుదండము.

క. నారాయణ లక్ష్మీపతి
నారాయణ వాసుదేవ నందకుమారా
నారాయణ నినునమ్మితి
నారాయణ నన్నుఁ బ్రోవు నగధర... 92

టీ. నారాయణ లక్ష్మీపతి=నారాయణ వాసుదేవ, నందకుమారా=నందునిపుత్రా, నిన్నునమ్మితినిగాన, నన్నుఁబ్రోవుము.

తా. అనేకమార్లునిన్ను నారాయణనారాయణ యనుచున్నానుగాన నను బ్రోవుము.

క. తిరుమణి దురితవిదూరము
తిరుమణి సౌభాగ్యకరము త్రిజగములందున్
తిరుమణి పెట్టినమనుజుఁడు
పరమపవిత్రుండు భాగ్యవంతుఁడు... 93

టీ. తిరుమణి=తిరుచూర్ణమను బొట్టు, (పట్టెవర్ధనం) దురితవిదూరము=పాపములను బాపునదియు, సౌభాగ్యకరమగునదియు నగును, అది పెట్టిన మనుష్యుఁడు, పూజ్యుండును పవిత్రుండునగును భాగ్యవంతుఁడునగును.

తా. నీకుప్రీతియగుతిరుమణినుంచువాఁడుసర్వవిఘ్నములధన్యుఁడగునుకృష్ణా

క. శ్రీలక్ష్మీనారాయణ
వాలాయము నిన్నుఁదలఁతు వంద్యచరిత్రా

ఏలుము నను నీబంటుగ
జాలా నిను నమ్మినాను సరసుఁడ... 94

టీ. శ్రీలక్ష్మీనారాయణా వాలాయము నిన్నుదలఁతు=నిరంతరము నిన్నుగొల్తును, వంద్యచరిత్రా=వందనము చేయఁబడు చరిత్రగలవాఁడా, ఏలుమునను—నిబంటును చాలా నిను నమ్మినాను.

తా. లక్ష్మీనారాయణా నిన్నెన్నఁడునుమరువనుగానన్ను మఱువక రక్షింపుము.

క. శ్రీధర మాధవ యచ్యుత
భూధర పురుహూతవినుత పురుషోత్తమ నీ
పాదయుగళంబు నెప్పుడు
మోదముతో నమ్మినాఁడ ముద్దుల... 95

టీ. శ్రీధర=లక్ష్మీదేవిని వక్షస్థానమందుంచినవాఁడా, మాధవ=అచ్యుత, భూధర=భూమిని ధరించినవాఁడా, పురుహూతవినుత=ఇంద్రనుతా, పురుషోత్తమనీపాదయుగళంబున్=పాదములరెంటిని, ఎప్పుడున్=ఎల్లప్పుడు, మోదముతోనమ్మినాఁడ=సంతసముగా నమ్మితిని.

తా. అనేక నామములుగల కృష్ణా! నీపాదములనే నమ్మితిని.

క. శిరమున రత్నకిరీటము
కరమున నవ శంఖచక్ర ఘనభూషణముల్
ఉరమున వజ్రపుపతకము
సిరినాయక యమరవినుత శ్రీహరి... 96

టీ. శిరమున్=తలపై, రత్నకిరీటము=టోపి, కరమునన్=చేతియందు, శంఖచక్రాదిభూషణములు, ఉరమునన్=గుండెలయందు, వజ్రపు పతకము, నీకున్నది

తా. కృష్ణా! కిరీటము, పతకము, శంఖచక్రములు నీకుఁగలవు.

క. అందెలఁ బాదములందును
సుందరముగ నిల్పినావు సొంపమరంగా
మందరధర మునిసన్నుత
నందుని వరపుత్ర నిన్ను నమ్మితి... 97

టీ. అందెలన్=అందెలను, పాదములందున=సుందరముగనిల్పినావు, సొంపమరంగా=అందముగా కాళ్ళనుంచుకొంటివి, మందరధర=మందరగిరి ధరించినవాడా, మునినుత నందునిపుత్రా, నిన్నునమ్మితి.

తా. కృష్ణా! బంగరుటందెలుగలనీపాదములనమ్మితిని గానన్ను గావుము.

క. కందర్ప కోటిసుందర
మందరధర భానుతేజ మంజులదేహా
సుందరవిగ్రహా మునిగణ
వందితమిముఁదలఁతుభక్తవత్సల... 98

టీ. కందర్పకోటిసుందర=కోటిమంది మన్మధులంత యందముగలవాడా, మందరధర భానుతేజా=సూర్యకాంతిగలవాడా, మంజులదేహా=శృంగారమగుశరీరముగలవాడా, సుందరవిగ్రహా=మునిజనవందిత, నిన్ను దలఁతును.

తా. కృష్ణా! కోటిమంది మన్మధులంత యందమగునిన్ను మరతునా.

క. గోపాల దొంగ మురహర
పాపాలను బాఱదోలు ప్రభుఁడవునీవే
గోపాలమూర్తి దయతో
నాపాలిటఁ గలిగిబ్రోవు నమ్మితి... 99

టీ. గోపాలా=గోవులగాచువాఁడా, దొంగ=మురహర, పాపాలను బాఁగదోలు ప్రభుఁడవునీవే=పాపములం బారఁగోలువాఁడవునీవే,గోపాలమూర్తి నాపాలిటఁగలిగి=నాయందుండి ప్రోవుము.

తా. గోపాలా! పాపములనన్నింటిని ద్రోలి నన్ను గావుము.

క. అనుదినము కృష్ణశతకము
వినిఁజదివినను ముక్తి వేడుకగలుగున్
ధనధాన్యము గోగణములు
తనయులు నభివృద్ధిఁబొందు దద్దయు... 100

టీ. అనుదినము=ప్రతిరోజును, కృష్ణశతకమును వినినను పఠించినను=చదివినను ముక్తి వేడుకగా గలుగును ధనధాన్య, గోగణములును, తనయులు అభివృద్ధిపొందుదురు.

తా. ఈకృష్ణశతకమును రోజును ఎవ్వరయినను చదివినను వినినను కొడుకులు, కూతుళ్ళు, ధనధాన్యములు, పశువులు మొదలగుసర్వసంపదలు వృద్ధిపొందును.

క. భారద్వాజ సగోత్రుఁడ
గౌరవమున గంగమాంబ కరుణాసుతుడన్
పేరు నృసింహాహ్వయుఁడన్
శ్రీరమయుత నన్నుగావు సృష్టివికృష్ణా. 101

టీ. భారద్వాజసగోత్రుఁడ గౌరవమునన్, పేరునృసింహుడను,శ్రీరమయుత=లక్ష్మిసమేత, నన్నుగావుము.

తా. కృష్ణా! భారద్వాజగోత్రుఁడను, గంగమాంబ కుమారుండను, నాపేరునృసింహుడు నీభార్యయగు లక్ష్మిదేవితోసహా నన్ను గాపాడుము.

బాలకళానిధిప్రణీత టీకాతాత్పర్యసహితకృష్ణశతకముసంపూర్ణము.

# మిలటరీ పాకశాస్త్రము

ఇందు మాంసము, పులావు, కుర్మా, మాంసముతో అనేకరకములుగ కూరలు చేయుట, కోడిగ్రుడ్డుతో పలువిధములుగ తయారుచేయు విధము చేపతో అనేకరకములు కూరలు చేయుట పచ్చిరొయ్యలు గారెలు వొండుట ఇంకా ఈరొయ్యలతో అనేక రకములు కూరలు వండుట సుమారు 200 పయిన కూరలు చేయువిధము అంతయు వ్రాయబడినది. వెల 1—0—0

# దస్తావేజుల మతలబి

ఇందు ఇల్లుక్రియం భూమిక్రియం మనువర్తియిచ్చేపద్ధతిని క్రియం, భూమితణకా, పంచాయితీ తీర్పులు, పిరాయింపుదస్తావేజులు, జామీను పత్రములు, డిక్రీట్రాన్సుఫరు, ప్యారీకత్తు మరణశాసన, విల్లుదస్తావేజులు, దత్తతఅధికారపత్రిక, దానపత్రము, మనోవర్తి, దస్తావేజులు, కవులకదపాలు, కండగుత్తకవులు, అద్దెచీటి, హక్కువిడుదల దస్తావేజు, గోడహక్కును గూర్చి సందుహక్కునుగూర్చి, మనోవర్తి హక్కునుగూర్చి ఇల్లుక్రియము, రద్దుదత్తత, రద్దువివాహావిమోచన, ఆగ్రిమెంట్లునుగూర్చి నవుకరీగూర్చి, సరుకు సప్లయినిగూర్చి, తాకట్టుపత్రము, ప్రోనోట్లు, ప్రోనోట్లుట్రాన్సుఫరు, పవరు ఆఫ్టర్నీలు, పారీవ్యాపారపు దస్తావేజులు, రసీదులు, తనకాదస్తావేజ్లు. ఈయన్ని విషయములు వ్రాసుకొనుపద్ధతులు ఇందు వ్రాయబడినవి. వెల 0-12-0

# మహాపతివ్రతల కథలు

ఇందు సుకన్య, దమయంతి, సావిత్రి, చంద్రమతీ, పద్మావతీ, గాంధారి, కుంతీ, సునీతి, రుక్మిణీ, అరుంధతీ, సరసాదేవి, సంధ్యావళీ, ద్రౌపతీ, శాకుంతల, సీతాదేవి, అనసూయ, సుమతీ, నాలాయినీ, ఊర్మిళ, లోపాముద్ర, జయప్రదమున్నగు పతివ్రతాశిరోమణుల కథలు 21 గలవు. 160 పేజీలు. ప్రతిస్త్రీ చదువదగినది వెల 1-0-0.

---

కొండపల్లి వీరవెంకయ్య, శ్రీసత్యనారాయణ బుక్‌డిపో, రాజమండ్రి.

# సతీసక్కుబాయి.

ఆ అంకముల నాటకము.

గ్రంథకర్త:—కొచ్చర్లకోట కామేశ్వరరావుగారు.

భక్తిరసప్రధానమైన చక్కని నాటకము. భక్తాగ్రగణ్యురా సక్కుబాయి శ్రీకృష్ణ సాక్షాత్కారము కొఱకెన్నియో బాధలనుభవిం నది. అత్తగారు కఠినహృదయయై ఆమెను వివిధవిధముల నిందించిన శిక్షించినది. తుదకు వాతలు కూడ పెట్టి తనయసహానము వెల్లడించుకొన్న అత్తగారు కాఠిన్యమును కోడలు సక్కుబాయి అమాయికహృదయ మెం కష్టబడి సహించినది. తుదకు శ్రీకృష్ణపరమాత్మని కృపకు పాత్రు మోక్షసామ్రాజ్యము జేరినది. కోడలునన్ని బాధలు పెట్టినపుడుకూడ స్మ చిన అత్తగారినికూడ పాండురంగవిఠలుఁడు తన కరుణాకటాక్ష వీక్ష ముల ననుగ్రహించినాఁడు ప్లీడరుగారి భార్య స్త్రీస్వాతంత్ర్యోద్యమ నారంభించినది మీటింగులలోని స్త్రీల యుపన్యాసములు కడుపు నవ్వుపుట్టించును. చదువరుల నానందసాగరతరంగ మాలికల దేలిం డించును వితంతువిలాపము హృదయవిదారకముగనుండును. ప్లీడరు ఆ భార్యలసంభాషణ మత్యంతానందసందాయకము, హాస్యపూరితము. సక బాయి భర్త అమాయికత్వము మిక్కిలి జాలికలిగించును. ఒకవంక ఒకవంక భార్య ఇరువురును ముఖ్యులే. ఎవరిమాటవినవలయునో తెలిం తబ్బిబ్బుపడు నాతనితాపత్రయము చదువరులను విషమసమస్యముందిడు సాంఘికలోపము లెన్నో యిందు వివరింపబడినవి. నవరసభరితవ నవానందసంధాయకము. విచిత్రకథావిలసితము. ప్రదర్శనయోగ్యము నీనాటకరాజము వెల రు 1—0—0 చక్కని పాటలుగలవు.

---

వీరవెంకయ్య, శ్రీసత్యనారాయణ బుక్ డిపో, రాజమం

# సతీ సక్కుబాయి.

ఆఱంకముల నాటకము.

గ్రంథకర్త:—కొచ్చర్లకోట కామేశ్వరరావుగారు.

భక్తిరసప్రధానమైన చక్కని నాటకము. భక్తాగ్రగణ్యయగు సక్కుబాయి శ్రీకృష్ణ సాక్షాత్కారము కొఱకెన్నియో బాధలనుభవించినది. అత్తగారు కఠినహృదయయై ఆమెను వివిధవిధముల నిందించినది. శిక్షించినది. తుదకు వాతలు కూడ పెట్టి తనయసహానము వెల్లడించుకొన్నది. అత్తగారు కాఠిన్యమును కోడలు సక్కుబాయి అమాయికహృదయ మెంతో కష్టబడి సహించినది. తుదకు శ్రీకృష్ణపరమాత్మని కృపకు పాత్రులై మోక్షసామ్రాజ్యము జేరినది. కోడలునన్ని బాధలు పెట్టినపుడుకూడ స్మరించిన అత్తగారినికూడ పాండురంగవిఠలుఁడు తన కరుణాకటాక్ష వీక్షణముల ననుగ్రహించినాఁడు ప్లీడరుగారి భార్య స్త్రీస్వాతంత్ర్యోద్యమము నారంభించినది మీటింగులలోని స్త్రీల యుపన్యాసములు కడుపుబ్బ నవ్వుపుట్టించును. చదువరుల నానందసాగరతరంగ మాలికల దేలియాడించును వితంతువిలాపము హృదయవిదారకముగనుండును. ప్లీడరు ఆతని భార్యలసంభాషణ మత్యంతానందసందాయకము, హాస్యపూరితము. సక్కుబాయి భర్త అమాయికత్వము మిక్కిలి జాలికలిగించును. ఒకవంక తల్లి, ఒకవంక భార్య ఇరువురును ముఖ్యులే. ఎవరిమాటవినవలయునో తెలియక తబ్బిబ్బుపడు నాతనితాపత్రయము చదువరులను విషమసమస్యముందిడును. సాంఘికలోపము లెన్నో యిందు వివరింపబడినవి. నవరసభరితమున నవానందసంధాయకము. విచిత్రకథావిలసితము. ప్రదర్శనయోగ్యమునగు నీనాటకరాజము వెల రు 1—0—0 చక్కని పాటలుగలవు.

---

వడ్లమూడి వీరవెంకయ్య, శ్రీసత్యనారాయణ బుక్ డిపో, రాజమండ్రి.